

ఓమ్.

(ఉపన్యాసాంతమున సభవారికి శ్రీస్వాములవారిట్టుల జెప్పిరి.— తొలుత తన స్వకీయోపయోగముకొఱకు వ్రాసికొనిన యీయుపన్యాస సంగ్రహమును, యతని శిష్యులగు సభవారిలో కొందరు దాని నచ్చొత్తించిన నలువురకుపయోగముగనుండునని విలేఖకులగు రావుగారి నడిగినంతట, వారు నా యనుమతినిపొందినట్లయిన యాప్రకారముజేయుమని చెప్పిరి. నాకది కొందర కుపయోగకారియైయుండునని దోచి యాప్రకారము చేయవచ్చునని జెప్పినమీదట సభవారిలో ఎ. గోవిందరాజులుశెట్టియును మరికొందరు ప్రయాసపడి వారిఖర్చుపెట్టి కొన్నిసంచికలు ముద్రించి కొందరకు నుచితముగనే యిచ్చిరి. రాగరాగ సభవారికందరకును పంచిపెట్టమను ప్రార్థనలు బలమై సంచికలెక్కువగ ముద్రించవలసిన యవసరమున్నదిగాన స్వల్పక్రయము నిర్ణయించుటకు ముద్రించువారు నాయభిప్రాయమునడిగిరి. ఇది నాకును, విలేఖకులగు రావుగారికిని సమ్మతము గాకపోయినను, అందరకు నుపయోగకరమగువిషయమున కొందరు మాత్రము ఖర్చుపెట్టుట న్యాయముకాదుగాన అందుకొఱకున్ను క్రయమునేర్పరచినట్లయిన సభవారెందరెంత శ్రద్ధగలవారై సంచికల నడుగుదురో దాని తెలియుటకొఱకును ప్రతియుపన్యాససంచికకును అర్ధణావంతున యతిస్వల్పక్రయమును పైసంచికమొదలు నిర్ణయించుటకు సమ్మతించినాడను, యిది సభవారికందరకును సమ్మతమయినదని నమ్ముచున్నాడను.)

మెప్పటికిని సత్యమైనదియు. ఇట్టి [illegible]
మను సత్కార్యమునకు ఆటంకములు గలుగకపోదు. కావుననే,



ఓమ్.

శ్రీమాన్, బ్రహ్మశ్రీ బెంగుళూరు

పండిత శ్రీనివాస భాగవతస్వాములవారి

జ్ఞానవాసిష్ఠోపన్యాస సంగ్రహము

# వైరాగ్యప్రకరణానుబంధము.

(ఏడవ సంచిక.)

శ్రీయుత, సి. యన్. రావుగారు యిటుల వ్రాసిరి.

ఈ దినము వుపన్యాసారంభమునకు పూర్వము సభవారినిగూర్చి శ్రీస్వాములవా రిట్లుచెప్పిరి:— ఈవైరాగ్యప్రకరణమును కొంతవరకువిని నమాత్రమున భయపడి కొందరు యిట్టివేదాంత శ్రవణమును జేయువారు శ్రవణకాలమునందున జెప్పబడు విషయముల ననుసరించి యిట్టి యనుష్ఠానమునందుండిననే సార్థకముగాని లేకున్న వ్యర్థమనియును, అట్లుండుట దుర్లభముగాన యిట్టి వేదాంత శ్రవణమును జేయుటకన్నను యేదైన మరియొక కథాశ్రవణమును జేయవచ్చుననియును, తాము అభిప్రాయపడి యిట్టి యభిప్రాయమునుయితరులకు కొందరకంటించునట్లు దెలియవచ్చుచున్నది. "శ్రేయాంసి బహువిఘ్నాని" యనిమంచికార్యమునకు అనేకాటంకములు గలుగును. జనులకు చక్కగ జ్ఞానోపదేశముజేయుటకు యీజ్ఞాన (యోగ) వాసిష్ఠమునకన్నను గొప్పగ్రంథము మరియొకటి లేదనియును అందరును జదివితీరవలయుననియును యిదివరకు జెప్పబడినది. ఆమాట యిప్పటికిని యెప్పటికిని సత్యమైనదియే. ఇట్టి గొప్పవిషయమును శ్రవణముజేయుట మను సత్కార్యమునకు ఆటంకములు గలుగకపోదు. కావుననే,

శ్లో॥ మనుష్యాణాం సహస్రేషు, కశ్చిద్యతతిసిద్ధయే ।
యతతామపి సిద్ధానాం, కశ్చిన్మాంవేత్తితత్వతః॥ ”

మనుష్యులలో వేలసంఖ్యలయందు, ఒకానొకడు మాత్రమే ఆత్మ జ్ఞానసిద్ధికొఱకై ప్రయత్నముచేయుచున్నాడు, అట్లు ప్రయత్నించువారిలో నొకానొకడు మాత్రమే జ్ఞానసిద్ధిని బొందుచున్నాడు, అట్టి సిద్ధిని బొందినవారిలో నొకానొకడు మాత్రమే పరబ్రహ్మ స్వరూపమును దెలిసికొనుచున్నాడు, అని గీతలో చెప్పబడెను. పూర్వజన్మసుకృతను వలననే యీజన్మమునందు మలినవాసన బొత్తిగనశించి శుద్ధవాసనగలిగి వేదాంతశ్రవణమును జేయవలయును, బ్రహ్మజ్ఞానమును సంపాదించవలయును, మోక్షమునుపొందవలయుఅను, కోరికపుట్టును పూర్వజన్మదుష్కృతమువలన మలినవాసన యింకను వదలనివారి కట్టికోరికపుట్టదు. ఇందున కొక దృష్టాంతము—నలువురు బెస్తవాండ్లు చేపలుబట్టి పొరుగూరియం దమ్ముకొని బోవుచుండగా దారినడుమ గాడాంధకారముగ మబ్బుబట్టి బలమయిన కుంభవరుషము గురియసాగీన, ఆరాత్రి అచ్చటనున్న యొకతోటవాని యింటం బండుకొనిరి; మరుదినము భగవతార్చనకు యాతోటవాడు శేఖరించి యాయింటంబెట్టియున్న మల్లెమొల్లె చామంత్యాది పుష్పముల సువాసనకు యాబెస్తవారు సహించలేక అహస్యపడి నిద్రబట్టక తమచేపలబుట్టలనందుకొని యందున తమతలలుబెట్టికొని యాచాపలవాసనబట్టుచు సుఖముగ నిద్రజెందిరి॰ఇట్లు మలినవాసన విడువనివారికి వేదాంతశ్రవణము, అందులో వైరాగ్యప్రకరణము, మొదట విషతుల్యముగ తోచును. ఐనను తక్కిన ముముక్షు, వుత్పత్తి, స్థితి, ఉపశమ, నిర్వాణ ప్రకరణములను, అట్టి యభిప్రాయముగలవారందరును వోర్పుగలిగి సావధానచిత్తులై శ్రద్ధతో విని జ్ఞానవంతులగునట్లు భగవంతుడనుగ్రహించునుగాక యని చెప్పిరి.

అస్థిర మైనట్టియు, సుఖము లేనట్టియు, గుణరహిత మైనట్టియు, ఆయువునందును తనకు గలిగిన వైరాగ్యమునుదెలిపి, స్వామీ! శరీర,ధన, ఆయువులవలన గలిగి శత్రువువంటి మరియొక మిథ్యావస్తువు,

# అహంకారము.

అహంకారమనగా అజ్ఞానమువలన, యీశరీరము స్థిరమైన దనియును. యీశరీరమునకంటె పరమైనవస్తువు వేరేమియులేదనియును, అన్నిటికి నితానే కర్తయనియును అనుకొని నేను, నేను, అనుట, అహంకారమనబడును. ఇట్టి అహంకారము అజ్ఞానమువలన వ్యర్థముగ పుట్టి వ్యర్థముగనే పెరిగి మిథ్యారూపముగనుండి శత్రువువలె నన్నుభయపెట్టినది.

"శ్లో॥ అహంకారవశాదాప, దహంకారాద్దురాధయః।
అహంకారీవశాదీహా, నాహంకారాత్పరోరిపుః॥"

అహంకారము వలననే ఆపదలుగలుగును, అహంకారము వలననే దుష్టమనోవ్యాధులు గలుగును, అహంకారమువలననే కోరికలు గలుగును. యిట్టి అహంకారమునకంటె గొప్పశత్రువులేదు. ఇట్టి అనాది శత్రువగు అహంకారమునుపొంది ఆహారమును భుజించుటలేదు, వుదకమును పానముచేయుటలేదు గావున రాజ్యభోగముల నిక నేనేమి యనుభవించుదును.

"అహంకారవశాద్యద్య, న్మయాభుక్తం హ్యాతంకృతం।
తత్తత్సర్వ మవస్త్వేవ, వస్త్వహంకారరిక్తతా॥"

అహంకారవశవర్తినై, నేను మేదేదిభుజించితినో, యెట్లెట్లువిహరించితినో, యేమేమిచేసితినో, అవియన్నియును అసత్యమే యగును, నిజమైనవికావు, గాన అహంకారశూన్యమే సత్యము.

అనగా అజ్ఞానమువలన శరీరాభిమానముగలిగి కేవలము శరీరపోషణార్థమై యెవరుదేనినైనను భుజించుచున్నారో అదిమిథ్యాభోజనమేగాని నిజమైన భోజనముగాదు, విషతుల్యమైనది. ఎవరు ఆత్మానాత్మజ్ఞానముగలిగి "కబళే కబళే గోవిందం" అని శ్రీపెరియాళ్వార్లు సెప్పినటుల దేనినైనను భగవదర్పణ పూర్వకముగ భుజించుచున్నారో యదియేనిజమైన భోజనము, అమృతతుల్యమైనది. ఇట్లే ఆకలిగొన్నవారి కన్నము బెట్టునప్పుడును భగవత్ప్రీతి కొరకే చేయవలయును. ఇందుకుపమానముగ "బైబిల్" అను క్రీస్తువేదమునందిట్లు చెప్పియున్నది. "*Give food unto the poor for the sake of the Lord withont its being meant for the poor direct.*

*it is aeeepted by God and highly satis-factory to Him'*
భగవ దర్పితముగ బీదల కన్నముపెట్టి, బీదలకొఱకు పెట్టినామని (య
హంకరించి) యనుకొనకుండినయెడల, దానిని భగవంతుడతిప్రీతిగ నంగీక
రించును, యని యందునకర్థము. ఇందువలన మనుజుడు తాను భుజించుట
యున్ను యితరులకు భోజనముపెట్టుటయున్ను భగవదర్పణము కొఱకే
యనిన్ని, జ్ఞానముగలిగినట్టిన్ని జ్ఞానములేనట్టిన్ని ప్రతిమనుజుని యందున
నున్ను భగవంతుడున్నాడనిన్ని యేర్పడుచున్నది. ఇందున కనుగుణముగ,
శ్రీరామకృష్ణ పరమహంసగారు *"God is in all men, but all men
are not in God"* అని చెప్పియున్నారు. యిందుకు భగవంతుడు
అందరియందున్ను వున్నాడుగాని అందరున్ను భగవంతునియందు లేరని
అర్థమగుచున్నది. అట్లనిన, భగవంతుడందరియందున్న అందరును భగవం
తునియందెట్లు లేకపోతురు? అను సందేహముగలుగును. అందుకు సమా
ధానము యేమనగా, బ్రహ్మజ్ఞానమును సంపాదించుకొని శరీరమునకు
వేరైయున్న బ్రహ్మమే సత్యము శరీరాది యెల్లవస్తువులును మిథ్యయును
అస్థిరములునని తెలిసికొని బ్రహ్మస్వరూపదర్శనమును చేయుచున్నవారే
భగవంతునియందున్నవారుగాని తక్కినవారు, అనగా, అజ్ఞానమునందు
బడి శరీరము స్థిరమనుకొని, శరీరమునకన్న వేరుగ వుత్కృష్టమయిన
వస్తువు యొకటి యున్నదని తెలిసికొనక, నేను, యను అహంకార జనిత
దుఃఖములో బడి పరితపించుచుండువారు భగవంతుని యందున్నవారు
గారు, కొందరిట్లు నేనునేను అనుచు, వ్యవహారమునందు మాటలాడునపు
డు, నేను, అను అస్మచ్ఛబ్దార్థమును వదలి నాకన్నులు చూచినవి, నా
చెవులు వినినవి, నాముక్కు ఆఘ్రాణించినది, నానోరు మాట్లాడినది,
నాచేతులుచేసినవి, యనుచుండునపుడు నా, నా, అను వేరు వస్తువొకటి
తనలో నున్నదని సూచించుచు ఆవస్తు విట్టిదియని తెలియగకయేయున్నా
రు; అట్టివారును భగవంతునియందున్నవారుకారు; మరికొందరు అన్ని
యింద్రియావయవములును చక్కగనుండియును, అహంకారము వలన
సత్కర్మలజేయనివారు, యెట్లనిన.— ధనికుడైన యొకఅహంకారోన్మత్తుని
వద్దకు యొకబీదవాడు పోయి, తానతి బీదవాడనియును ధర్మార్థమైన
ద్రవ్యసహాయముజేయుమనియును స్పష్టముగ జెప్పుకొనెను; ధనికుడా బీద
వానిని చక్కగచూచి వాడుచెప్పినది యంతయును వినియును తానేమి

యును బదులుజెప్పక, తనసేవకుని బిలచి, యెవరోవచ్చినాడు చూడమని యును, యేమిచెప్పదున్నాడనియును, యేమయిన నిచ్చిపొమ్మనుమనియు ను చెప్పెను. ఇట్లు కన్నులుండియును గానక, చెవులుండియును వినక నోరుండియును మాటలాడక, చేతులుండియును సత్కర్మల దానుచేయక నుండు అహంకారులున్న భగవంతునియందున్నవారు కారు.

కాబట్టి సమస్తకార్యములును అహంకారములేక చేయవలయును,అనగా,నేనుచేయుచున్నాను, నావలనచేయబడినది యని యనుకొనగూడదు. కొందరుమూఢులు దుష్కర్మలనుజేసి యవి భగవంతునివలన జేయింపబడినవనియనుకొందరు,--ఒకానొక బ్రాహ్మణుడు ధాన్యము నెండబోసి కావలిగాచియుండగా యొక యావువచ్చి యాధాన్యమును మేయుచుండెను, అప్పుడా బ్రాహ్మణుడు దన చేతనున్న కట్టెతో నాయావును గొట్టగా నాదెబ్బ యాయావుపట్టున దగిలి యాయావు పడిచచ్చెను. అదిచూచి యాబ్రాహ్మణుడు కృష్ణార్పణమనుచుండెను. అది రుక్మిణీదేవికి దెలిసి దుఃఖించి, ఇదియేమి అన్యాయము యీబ్రాహ్మణుడు తానుజేసిన గోహత్యను నీకర్పించుచున్నాడు. ఆగోహత్య నిన్నుబట్టునేమోనని భయపడుచున్నానని దనభర్తయైన శ్రీకృష్ణపరమాత్మతో చెప్పిన ఆయననవ్వి, మంచిది చూతమనిచెప్పి యామరునాడు కృష్ణమూర్తి యొక ముసలివానిరూపమున యాబ్రాహ్మణుని యింటికిబోయెను. అప్పుడా బ్రాహ్మణునియింట సంతర్పణకై సమస్తపదార్థములును సిద్ధమైయుండెను. ముసలివాని వేషముతోనున్న కృష్ణుడదిజూచి యింటిలో జొరబడి యన్నియును దాకి కొన్నిటిని భక్షించెను. అంతట నాబ్రాహ్మణుడు కోపావేశముతో, బ్రాహ్మణసంతర్పణకైయున్న పదార్థములను యిట్లుజేసితివని పైబడరాగా, కృష్ణమూర్తి శాంతముతో యీసంతర్పణజేయువారెవరని యడిగెను. అందుకాబ్రాహ్మణు డహంకారముతో నేను చేయుచున్నానని చెప్పగా నిన్న గోవునుగొట్టి చంపి కృష్ణార్పణమని యాగోహత్యను నాపైబెట్టి, నేటి సంతర్పణమాత్రము నీవు చేయుచున్నాననెదవాయనిన, ఆబ్రాహ్మణుడు భయ లజ్జా కంపితుడై జ్ఞానోదయముగలిగి ప్రదక్షిణ నమస్కారములుజేసినట్లు యొక కథయున్నది. అట్లుగాక,

"శ్లో॥ యత్కరోషియదశ్నాసి, యజ్జుహోషిదదాసియత్ ।
యత్తపస్యసి కౌన్తేయ, తత్కురుష్వమదర్పణం ॥"

ఎప్పుడేపదార్థములను దినినను, యేహవిస్సునువేల్చినను, యేమి దానమిచ్చినను, యేమి జపతపవ్రతాదుల నాచరించినను, అనగా, సమస్త కార్యములును, నాకు ప్రీత్యర్థముగ జేయబడినట్లు మనస్సున నెంచికొని నాకర్పించుచుండుము, అని గీతలలో చెప్పియున్నట్లు అహంకారములేక అన్ని కార్యములును జేయవలయును.

కావుననే రామచంద్రుడు అహంకారమువలన తానుచేసిన కార్యములన్నియును అసత్యములనియును అహంకారమును వదలిపెట్టిన స్థితియే సత్యమైనదనియును, యెంతవరకు అహంకారమను మేఘము పట్టుచున్నదో, అంతవరకున్న ఆశయున్న పూలగుత్తి వికాసమును పొందుచున్నదనియును, అనగా అహంకారమువలన ఆశ యధికమగుచున్నదనియును, అట్లహంకారములేని వృత్తినవలంబించియున్నప్పటికిని చిత్తవిశ్రాంతిలేక చింతపడుచున్నానుగాన విశ్వామిత్రమునీంద్రా! నాకు యేదియుక్తమైనది యోదానిని చెప్పదగునని రామచంద్రుడనెను.

"శ్లో॥ నాస్తికామసమోవ్యాధిః, నాస్తిమోహసమోరిపుః ।
నాస్తిక్రోధసమోవహ్నిః, నాస్తిజ్ఞానాత్ పరంసుఖం ।"

కామమునకు సమానమైన రోగమును, మోహమునకు సమానమైన శత్రువును, క్రోధమునకు సమానమైన అగ్నియును, జ్ఞానమునకు సమానమైన సుఖమును, మరియొకటి ప్రపంచమునందులేదు; గొల్ల యాపదలకును ఆలయమైనట్టిన్ని, అస్థిరమైనట్టిన్ని, లోపలనున్నట్టిన్ని, కామక్రోధాది దుర్గుణములను వృద్ధిబొందించునట్టిన్ని, యీ అహంకారము దుఃఖమయమై యున్నది,

శ్లో॥ + × + యత్నాదహం కృతిపదం పరితోతిదుఃఖం ।
శేషేణమాంసమను, శాధి మహానుభావ॥"

అట్టియహంకారమును ప్రయత్నముతోడ వదలుచున్నాను, యికను నాకుఆత్మజ్ఞానమునుబోధింపుమని రామచంద్రుడు విశ్వామిత్రునివేడెను. ఇట్టి మనోపరిపాకవృత్తిగల శిష్యుడున్నయెడల సద్గురువుతానైవచ్చి జ్ఞానోపదేశము చేయును.

ఇట్లు అహంకారము వలన దురాశయును వృద్ధిబొందునట్లు దేలియుచున్నది. అట్టి దురాశవలననే దనశరీరమునందే గాక యితరశరీరముల యందును అభిమానమును అందువలన ఆపదలును దుఃఖమును కలుగును. ఒక బుద్ధిమంతుడును ధనవంతుడునైన తండ్రికి యొక కొమారుడుండెను. వాడుసౌందర్యవతియైన యొకస్త్రీయందుమిక్కిలి మక్కువగలిగి దానిపక్కబాయకుండెను. ఇట్లుండవాడొకానొక యవసర కార్యార్థమై నాలుగు దినములు గ్రామాంతరము పోయియున్న సమయమున నాస్త్రీ యకస్మాత్తుగ జచ్చెను. అదివిని బుద్ధి మంతుడైన తండ్రిదానింటికిపోయి దాని తల్లి కోరినంతధనమునిచ్చి దానిశవమును దీసికొనివచ్చి తనయింటి దొడ్డియందొకచోట మూసియుంచెను. మరునాడు దనకొమారుడువచ్చి దానింటికిపోవుటకుఅత్యాతురముతో ప్రయత్నపడుచుండగా, తండ్రితనకొమారుని కడ్డమువచ్చిమాటలయందు పరాకుబుట్టించి దొడ్డికిదీసికొనిపోయిమాటలాడుచుయిచటనే మోదుర్గంధముగ నున్నదని యాశవమునున్నచోటికి దీసికొనిపోయి పైని గప్పియున్నవస్త్రమునుదీసి ముందు దానిముఖమును చూడుమని కొమారునికి చెప్పెను. వాడాముఖమునుజూచి తనప్రియసఖి చనిపోయినదని దెలిసికొని దానియందున్న ఆశచే ప్రలాపించ నారంభించెను. అంతట నాబుద్ధిమంతుడగు తండ్రికప్పియున్న వస్త్రమును కడవరకు దీసి దానికళాస్థానములన్నియును, మర్మస్థానమువరకును గనుపడునట్లు జూపి, నీవు దీని శరీరమునందేస్థానమునకై మిక్కిలి మక్కువగలిగియుంటివో దాని నిజస్థితిని యిప్పుడు జూడుమనిజెప్పగా, యీగలు దోమలు చీమలు మొదలైనవాటిచే నావరింపబడి సహింపగూడని దుర్గంధమును గుప్పుచున్న దానిని జూచి,— "ఎవి యనకెఱన్నుం, పుబ్బవోయనకెఱన్నుం, యిందమన్నుం సరియనకెఱన్నుం, పరుందో యనకెఱన్నుం, తాళ్ళు శికఱవతి యనకెఱన్నుం, పున్నాయి యనకెఱన్నుం, యిన్నారుడలై, పిరియుమడళ్ వళత్తెళ్, యిదినాల్ యన్నపేరు యనకెఱ॥" అనగా, (యీశరీరమును) అగ్నినాకనును, పురుగులు నాకనును, మన్నునాకనును,

గద్దలు నాకనును, నక్కలు నాకనును, తోడేళ్లు నాకనును, యిట్టి దుర్గంధమయిన శరీరమును ప్రేమతో పెంచితిని, దీనివలన నాకేమి పేరుకలదు. అనగా నాకేమి ప్రయోజనము. అని పట్టణత్తుస్వాములవారు చెప్పినట్లు, నిప్పునగాల్చుటకును, మట్టిలో పూడ్చుటకును, మృగపక్షికీటకాదుల కాహారమునకును తగినదియై తనకేమియును ప్రయోజనము లేక దుర్గంధము గొట్టుచున్న దానినిజూచి యసహ్యపడి దన కదివరకు విషయాదుల యందుండిన యాశను వదలి విసుకుజెంది దనకు శరీరముయొక్క నిజస్థితిని దెలిపిన తండ్రికి నమస్కరించి జ్ఞానముగలవాడాయెను.

ఎట్టిజ్ఞానము గలవారికైనను అహంకారమును వదలుట మహాకష్టము, కాననే, తాయుమానస్వాములవారు,— 'యెత్తనై విధంగళ్ తాన్, కర్కినుం, కేట్కినుం, యెన్ యిదయం, వోదుంగవిల్లై, యానెనుం అగందదాన్, యెల్లళవుం మారవిల్లై +++'' యెన్ని విధములైన శాస్త్రములు చదివినను శ్రవణముజేసినను గూడ, నామనస్సు విశ్రాంతిని బొందలేదు, నేను, నేను, అను అహంకారము, నువ్వుబోచంతయైనను తగ్గలేదు; అని చెప్పియున్నారు. ఇందుకు దృష్టాంతముగ, మహాజ్ఞానసంపన్నుడును రాజయోగియునైన జనకమహారాజు తనమిధిలాపట్టణమున నేరస్థాపనకాబడిన యొక బ్రాహ్మణుని తన రాజ్యమును వదలిపోవున ట్లాజ్ఞాపించెను. అప్పుడా బ్రాహ్మణుడు, రాజా! తమరియును రాజ్యమెంతవరకో దాని పరిమితిని నాకు దెలియజెప్పిన నేను దానికావల బోయెదనని జెప్పెను. అంతట అహంకారసూచకమయిన, నారాజ్యము, నాది, యను అస్వచ్ఛార్థకము తన మనస్సున స్ఫురించి దిగ్గునలేచి యాబ్రాహ్మణునకు నమస్కరించి మన్నించిపంపినటుల చెప్పబడియున్నది. ఇట్లెంతటి జ్ఞానవంతులకైనను అహంకారమును విడుచుట కష్టతరముగుటవలననే "యత్నాత్" ప్రయత్నముతోడ వదలుచున్నానని రామచంద్రుడనెను. ఇందువలన, విడుచుటకు సాధ్యముకాని యహంకారమును ప్రయత్నపూర్వకముగ అనగా వేదాంతశ్రవణ మననాది నిశ్చయానుష్ఠానములవలన క్రమక్రమముగ వదలిపోవునట్లు చేయవలయుననియును, అట్లు అహంకారమువదలిపోయినంతట మహోపరిపాకవృత్తిగలవాడగుననియును, అట్టి మహోపరిపాకవృత్తిగలవానికె సద్గురూపదేశమతిసులభముగ లభించుననియును దెలియవలయును.

ఓం.

జ్ఞానవాసిష్ఠోపన్యాస సంగ్రహము

# వైరాగ్యప్రకరణానుబంధము

( ఎనిమిదవ సంచిక. )






ఇది,

శ్రీమాన్, బ్రహ్మశ్రీ బెంగుళూరు

పండిత శ్రీనివాస భాగవత స్వాములవారిచే

నుపన్యసింపబడి

శ్రీయుత సి. యస్. రావుగారిచే వ్రాయబడి

మద్రాస్

శ్రీలక్ష్మీ నృసింహ విలాస ముద్రాక్షరశాలయందు

ముద్రింపబడెను.

4-9-14.



ఓమ్.

శ్రీమా౯, బ్రహ్మశ్రీ, బెంగుళూరు,

పండిత శ్రీనివాస భాగవతస్వాములవారి

జ్ఞానవాసిష్టోపన్యాస సంగ్రహము.

# వైరాగ్యప్రకరణానుబంధము.

(ఎనిమిదవ సంచిక.)

శ్రీయుత, సి. యస్. రావుగారు యిటుల వ్రాసిరి.

నేటి వుపన్యాసారంభమున శ్రీస్వాములవారిటుల జెప్పిరి.—

శ్రీమహా విష్ణ్వవతారమూర్తియైన రాములవారి కెందు కట్టివైరాగ్యము చింతయును గలుగవలయుననియును, వసిష్టమహర్షి వచ్చి వారికట్టి విషయముల నేలబోధించవలయుననియును కొందరకు ఆవిషయము అనుమానకరముగ దోచుచున్నట్లు దెలిసినది. ఇటులనుకొనువారెవరైనను కొందరుందురనియూహించియే యింతకు పూర్వమే, మూడవ వుపన్యాసమునందు యీవిషయమైసూచించబడినది. అచ్చుబడుచున్న ఉపన్యాస సంగ్రహమను పుస్తకము, మూడవసంచిక, 8వ పుటలోని మొదటి 16 పఙ్త్కులయందు జూడవచ్చును. అప్రకారము సర్వజ్ఞులైన యీ రామచంద్రుడును వారి కులగురువగు వసిష్టమహర్షియును, వారి స్వప్రయోజనముకొఱకో, లేక, జీవకారుణ్యముగలవారై పామరుల నుద్ధరించుటకొఱకో, యెందుకొఱకట్టిప్రసంగమును బెట్టికొనిరో, యానిజస్థితిని మనవంటివారి వుడెఱుగజాలకున్నను, శ్రీరామనామము పరమ పావనమైనదనియును,

"క॥ ఏపాపములైనదగం ।

బాపగలదు రామనామ, భజనపరునసం॥

పాపముగలదని పలుకుమ ।
మహాపాతకియఘమునడప, నదియోపదిలక॥''

అని సీతారామాంజనేయ సంవాదమునందు జెప్పియున్నట్లు, రామనామము "బ్రహ్మహత్యా, సురాపానా, హేమస్తేయ, గురువధూసంగమ" మాదిగాగల మహా పాతకములనైనను నశింపజేయునదియై యున్నను, రామనామ జపము చేయువారికి పాపముకలదని పలుకు మహాపాపియొక్క పాపమును మాత్రము యీరామనామముగూడ బోగొట్టజాలదు, అనగా యేవిధమునైనను రామకథా కాలక్షేపమును జేయువారిని ఆక్షేపించుటకన్నను యెక్కువైన మహాపాతకము ప్రపంచమునందులేదనియును, ఆపాతకమును బోగొట్టుకొనుటకు పరిహారమేలేదనియును తాత్పర్యము. మానవజన్మమునెత్తి మృగప్రాయులై మలినమానసముగలవారికే యిట్టి యనుమానములు దోచుచుండునుగాని, శుద్ధమానసము గల ముముక్షుజనులకుదోచవు.

అహంకారమును గూడ విడిచిపెట్టు చున్నాననియును దనకు ఆత్మస్వరూపవిషయమును బోధించవలయుననియును జెప్పి పిదప,

## చిత్తము.

అనగా మనస్సుఅనుదాని స్వరూపమును రామచంద్రుడు విశ్వామిత్రునితో నిట్లుజెప్పెను.

''శ్లో॥ దోషైర్జర్జరతాంయాతాం, సత్కార్యాదార్యసేవితాత్
వాతాంతఃపిచ్ఛలవవ, చ్చేతశ్చలతి చంచలం॥''

మనస్సు, రాగద్వేషాది దోషములచే చెడినదియై, ఆర్యులచేత ఆచరింపబడిన సత్కర్మలను వదలిపెట్టి, చపల వృత్తులతో పెనుగాలియందు దగులుకొన్న నెమలిరెక్క పోచవలె అల్లాడుచున్నది.

మనుజుడు భుజించెడి అన్నము మూడుభాగములు అగుచున్నది అందున వకభాగము సాత్విక స్వభావమును జెంది అంతర్ముఖము గలది

యగుచున్నది, మరియొకభాగము శరీశముపెంచి రాజస స్వభావమును జెంది బహిర్ముఖముగలది యగుచున్నది, మూడవభాగము మలమై తమోగుణ స్వభావమునుజెంది యుండియును బహిర్ముఖము గలది యగుచున్నది. అంతర్ముఖమనగా తనలోపల తననిజస్వరూపమును జూడగల శక్తి; బహిర్ముఖమనగా బయట కనుపడు మిథ్యా ప్రపంచమునుజూచు స్వభావము; వివేకమువలన సాత్వికగుణము ననుసరించి అంతర్ముఖమునజూచినట్లయిన యీమనస్సు లేకయుండును; అవివేకమువలన రజస్తమోగుణముల ననుసరించి బహిర్ముఖమునజూచిన, యీమనస్సున్ను, దానివలన రాగద్వేషాది దోషములున్ను, అట్టి దోషములవలన అన్నిదుఃఖములలతో చపలవృత్తిని కలిగియుండును. ఇట్టి చపలముగలది గనుకనే శ్రీవివేకానందస్వాములవారు, మనస్సు (*Madened Monkey*) పిచ్చికోతివంటిదియని జెప్పిరి. మరియొక మహానుభావుడంటితోగాక, జన్మాంతరవాసనయను సురాపానము జేసి,దుస్సహవాసమను తేలుగుట్టి ఆశయను పిశాచముపట్టినటువంటి పిచ్చికోతివంటిదని జెప్పిరి.

" శ్లో॥ ఇతశ్చేతశ్చసువ్యగ్రం, వ్యర్థమేవాభిధావతి ।
దూరాద్దూరతరంశీఘ్రం, గ్రామేకౌలేయకోయథా॥ "

గ్రామశునకము (నడివీధికుక్క) వలె నిలకడలేక వ్యర్థముగా యెంత దూరమయినను పరుగులిడుచుండును. మరియును అట్లు పరుగులిడినను యేమియును ప్రయోజనమునుగానదు; వొకప్పుడు అధికధనమేమైనను లభించినను, కంతలుగల పూలబుట్టలో బోసిన నీళ్లు యెంతకునునిండకనే యుండునట్లు, యీమనస్సు యెప్పటికిని పరితృప్తిని బొందదు.

"శ్లో॥ క్రూరేణజడతాంయాత, స్తృష్ణాభార్యానుగామినా ।
శవఃకౌలేయకేనేవ, బ్రహ్మన్భుక్తోస్మిచేతసా ॥ "

క్రూరమైనట్టిన్ని వివేకములేనట్టిన్ని యీమనస్సు, తృష్ణ (ఆశ) యను భార్యననుసరించి శవమును కుక్కలు దిన్నట్లు నన్ను తినివేసినది.— అనగా, సత్వగుణమననుసరించి వివేకమువలన అంతర్ముఖమున లక్ష్యము నుంచి తెన్ను తాను జెలిసికొనక, రజస్తమోగుణముల ననుసరించి యవివేకమువలన బహిర్ముఖమునజూచుచు మనస్సును కల్పించుకొని, అందువలన

సంసారాదులయందు ఆశగలిగియుండువానిని అట్టియాశననుసరించి యెంతయును తృప్తినొందక సదా అలయుచుండు మనస్సు, దుఃఖములను కుక్కలచే దినిపించుచున్నదని తాత్పర్యము. కావుననే శ్రీశంకర భగవత్పాదాచార్యులవారుకూడ,

"శ్లో॥ నిత్యంస్వోదరపోషణాయ, సకలానుద్దిశ్యవిత్తాశయా ।
వ్యర్థం పర్యటనంకరోమి, భవతః సేవాంనజానేవిభో॥"

శరీరాభిమానపోషణాదిసుఖములయందలి ఆశకు లోబడి నీచులకు-గా దాస్యముచేయు మార్గమును దెలుసుకొనక, అనగా, ఆత్మజ్ఞానములేక, వ్యర్థముగా దిరుగుచు దినములను గడపితినిగదాయని విలపించిరి.

"శ్లో॥ అవాంతర దిశాకాశా, స్వాస్యైవా భ్రమణాయచ ।
తృణంచండానిలేనేవ, దూరంనీతోస్మిచేతసా॥

"శ్లో॥ పాతాళాద్గచ్ఛతాపృథ్వీం, పృథ్వ్యాశ్చపాతాళగామినా ।
కూపకాష్ఠం కుదామ్నేవ, వేష్టితోస్మికుచేతసా ॥"

మరిగాలి తృణమును పైకిదీసికొనిపోయి ఆకాశమునందు అలయించినట్లు, కుత్సితమగు యూమనస్సు నన్ను బహుదూరము దీసికొనిపోయి, అలసటచెట్టి, బావిలో నేలుచుండినబండను తేసిపోయినదారముతో బావినుండి పైకెత్తియున్నప్పుడు యా దారముతెగి మరల నాబండను బావిలోతున బడవేసినట్లు, నన్ను మరల పాతాళమునందు బడవైచినది. అనగా, ద్రవ్యాపేక్షచే యొకవర్తకుడు లక్షాధికారిగావలయునను అత్యాశవలన యొకవ్యవహారముజేసిన, అందున చేరక్షీణమువల్లనగాని, అగ్ని, చోరాదులవలనగాని అధికనష్టముగలిగి భిక్షాధికారియైన, అట్టివానికి ఆకాశమునుండి పాతాళమునబడినట్లేయుండునని తాత్పర్యము. (ఇట్లే, పతివ్రతయగు భార్యను వెదకివెదకి సంపాదించుకొని సంతసించుచుండు పురుషునికి అట్టిభార్య వ్యభిచారిణియైపోయినను, తపస్సుచేసి పుత్ర సంతానమునుబడసి యుప్పొంగుచునుండు తండ్రికి పుత్రశోకము సంభవించినను, యిత్యాదిసమయములందు ఆకాశమునుండి పాతాళమునబడినట్లె దోచి దుఃఖములు వృద్ధిబొందుచునుండునని యూహింపవలయును.)

"శ్లో॥ మిథ్యైవస్ఫారరూపేణ, విచారాద్విశరారుణా ।
బాలోవైతాళికేనేవ, గృహీతోస్మికుచేతసా॥"

భేతాళునివలన పసిబాలకుడు పట్టుకొనబడినట్లు, మిథ్య (వృత్తది)యై నట్టియును, విస్తారమయిన రూపముగలదిగ దోచునదియును, (ఆత్మ) విచారమువలన నశించునదియును, అకుత్సితమయిన మనస్సుచేత నేను హరింపబడితినని రామచంద్రుడు జెప్పెను.

ఇందుకు దృష్టాంతముగ. — ఒకరాజు లక్షల కొలది వెచ్చబెట్టి అద్భుతమైన నూతన దేవాలయమును గట్టించి కుంభాభిషేకమునకు (సంప్రోక్షణకు) నొకదినమును నిర్ణయించియుండెను. ఆముందుదినమున ప్రాచీన దేవాలయమునందుండు దేవుడు రాజమందిరమునకు వచ్చి, రాజా! పొరుగూరియందు నాకు పరమ అంతరంగభక్తుడైన కుమ్మరవాడొక దేవాలయమును గట్టించెను. వానికోరిక ప్రకారము క్రొత్త రేపటిదినము నేనచట తప్పకయుండవలసియున్నందున రేపటిదినము నేనిచటనుండనుగాన నీవు, రేపు కుంభాభిషేకమును జరుపక నిలుపవలసినదని యారాజుస్వప్నమున జెప్పిపోయెను. అంతట రాజు మేల్కొని అంత వ్యయ ప్రయాసలంబడి తనచేకట్టబడిన దేవాలయమునందనుగ్రహములేక యెవడో కుమ్మరవాడొక కుగ్రామమునందేదో దేవాలయము గట్టించిన దానియందనుగ్రహించినట్లు తాగనిన కల కల్లయో నిజమో యని హృదయమున ప్రాచీన దేవాలయమునకుబోయి చూడగా ఆదేవుడచట లేనందున తనకన్నకల కల్లగాదని తలచి తక్షణమే యాపొరుగూరికి గుఱ్ఱపుసవారినిబోయిచూడగా యా కుమ్మరివాడు యొక చిన్న దేవాలయమును గట్టించి యందున యొక మూర్తిని ప్రతిష్ఠించి యారాధించుచుండుటజూచి వాని కెదుట నిలుచుండెను. ఆకుమ్మరీడు రాజునుజూచి, రాజా! నాకోరిక మేరకు నేడిచటికి వేంచేయుటకు నీవు నేడు జేయదలచుకొనిన కుంభాభిషేకమును నిలుపు కొమ్మని నీతో నిన్న స్వప్నమున జెప్పినట్లు దేవుడు నాతో చెప్పెను. నీవా యభిషేకమును మరల నెప్పుడు నిర్ణయించుకొంటివని యడిగెను. అందుకు రాజాశ్చర్యపడి నా దేవాలయమునకన్నను, నీదేవాలయమున దేవుడు అంతశ్రేష్ఠముగ నుండుటకు కారణమేమని యడిగిన, యాకుమ్మరియిట్లనెను. నాదేవాలయమునందు గబ్బిలములు లేవు, నీదేవాలయములోపదునొకండు గబ్బిలము

యున్నవి. గాన వాటిదుర్గంధము దేవుడు సహించలేడనెను. అనగా జ్ఞానేంద్రియములు అయిదున్ను కర్మేంద్రియములు అయిదున్ను మనస్సు వకటిన్ని చేరి, పదునొకండు గబ్బిలములనిన్ని, అవి నశించి వాటిదుర్గంధమను మలినవాసనపోయి శుద్ధవాసనగలిగినప్పుడు ఆలయము దైవనివాసయోగ్యమైయుండును, అనగా, ఆత్మవిచారముచేయువానికి మనస్సువశించి బ్రహ్మజ్ఞానముగలుగునని దెలిపెను. ఆవల నామహానుభావుడగు కుమ్మరవానియనుగ్రహమువలన యీరాజుకృతార్థుడైనట్లు చెప్పబడియున్నది.

“శ్లో॥ వహ్నాదుష్ణతరశ్శైలా, దపికష్టతరక్రమః ।
వజ్రాపిదృఢోబ్రహ్మన్, దుర్నిగ్రహమనోగ్రహః॥”

మనస్సనెడి పెనుభూతము, అగ్నికన్నను భయంకరమైనదియై, పర్వతమునకన్నను యున్నతమైనదియై, వజ్రమునకన్నను కఠినమైనదియైయున్నది, మరియును.

సముద్రమునంతయును పానముజేయుటకును, మహామేరుపర్వతమును అడుగుతో జెలుకుటకును, దావాగ్నిని మ్రింగుటకును, సాధ్యమగును గాని, విషమయమగు యీమనస్సును నిగ్రహించి నిలువుటకు యెట్టివారికిని సాధ్యముగాదు. అందువలననే శ్రీ తాయుమానస్వాములవారు,

“ఆఴాఴికరయిన్రు, నిఱ్కవిల్లయో । కొడియవాల మముదాగవిల్లయో । వక్కడలిన్నీదువడవననిఱ్కవిల్లయో । వఙదరిత్తకిలకోటితాఴ్గను నిలనిఱ్కవిల్లయో । మేరువుంతణువాహావళియవిల్లయో। సప్తమేఘం ఘం వజ్రతరనాణయిఙశంజరిత్తుడవిల్లయో । వాఴ్గదువాఴ్గవేయి రామసుం యామడమంగైయాఘవిల్లయో । మణిమంత్రమాడియాల్ వేండు శిత్తిఘళు లఘుమార్గత్తిల్ వక్కవిల్లయో । పాఴ్గనయాఙమనంకువియవారు తందిరంపణ్ణువదు వువక్కరుమయో॥”

అనగా “మహా సముద్రములు కట్టలు లేక నేనిలచి యుండలేదా, విషము (హాలాహలము) భక్షించ దగియుండలేదా, చలించుచున్న సముద్రముమీద నావలు నిలచియుండలేదా, ఆకాశమునందఖిల వస్తుజాలమును క్రింద పడకుండ నిలచియుండలేదా, మేరుపర్వతము విల్లువలె వంగలేదా,

సప్తమేఘములును ఇంద్రునికి లోబడి సంచరించలేదా, దుర్జడతవలనశిలారూపమైన అహల్య మరల పాదస్పర్శవలన దన స్వరూపమును పాల్చలేదా, మణిమంత్రాదులవలన లోకమున సకలసిద్ధులును గలుగునట్లు జేయలేదా, (ఇట్లుండగా) చెడిపోయిన నామనస్సును నిర్మలపరచుటకు యొకయుపాయమును జూపుటకు నీకు సాధ్యముకాదా ?'' యని భగవంతుని సంబోధించిచెప్పిరి. అంతటివారట్లు జెప్పియుండగా లోకమునందు తమ మనస్సును తాము స్వాధీనపరచుకొనుటకు తెలివిలేని మనుజులు, శ్రీపురంధరదాసువారు జెప్పినట్లు,

సణ్ణు, హణ్ణు, మణ్ణు, తన్నాదెన్ను, నిన్నాదెన్న
బణ్ణాకెట్టు, బళ్ళి, బళ్ళి, ఒరదే మోహావృా+++''

రావణ దుర్యోధనులవంటివారినిగూడ జెరిపిన, ధరా, స్త్రీ, ధనాదిప్రపంచమాయలోబడి, యిదినాది, అదినాది,, యని వ్యర్థముగ వాదులాడు చున్నారు.

శ్లో॥ చిత్తంకారణమర్థానాం, తస్మిన్ సతిజగత్త్రయం ।
తస్మిన్ క్షీణే జగత్క్షీణా, తత్చికిత్స్యం ప్రయత్నతః ॥

'మనయేవ మనుష్యాణాం । కారణంబంధమోక్షయోః' అని యువివరకే జప్పబడినట్లు, మనస్సే సమస్తపదార్థముల పుట్టుకకు కారణము, మనస్సువలననే మూడులోకములు వున్నట్లుదోచును, మనస్సు నశించినట్లయిన లోకములేమియును లేకపోవును, గాన మనస్సును నిగ్రహించి దానిని నశింపజేయుప్రయత్నమును అవశ్యముచేయవలయునని రామచంద్రుడు జెప్పెను. ఈప్రకారమే కబీరుదాసువారుగూడ,

''మన కోమారరకోటాయి, వ్యాస,నారద,సభ,సుఖపాయీ।
హార,మనసోముక్తి,మనసోపేర, మనసేవిషయనహీ ప్యారా॥

కామ, క్రోధ, మద, దంభచలోభా, యేసభమన కాహీపీసారా॥
మన॥ కహాత కబీరా, మనరాజీహువాతో, కామఖక జలజాతా॥ మన॥''

జనన, బంధ, మోక్షములకును, కామక్రోధాదులకును మనస్సే కారణమై యున్నది, అట్టిమనస్సును యెట్టులైనను జయించవలయును అని జెప్పిరి.

మరియును పర్వతమువలన అరణ్యములు యేర్పడునట్లు మనస్సువలన అనేక సుఖదుఃఖములును ఉద్భవించుచున్నవి ("తసిన్ వివేక వశత స్తను తాం ప్రయాతే") వివేకమువలన మనస్సును నశింపజేసి నట్లైన, సుఖదుఃఖములు సులభముగనే వీడిపోవునని తలంచుచున్నాను, అనియిట్లు మనస్సుయొక్క స్వభావమునుగూర్చి తనయభిప్రాయమును రామచంద్రుడు జెప్పెను.

"తస్మిన్ కృశత్వం ప్రయత్నతః" దానికి (మనస్సునకు) వైద్యకర్మచేయుటకు ప్రయత్నము చేయవలయును "వివేకవశతాత్" వివేకమువలన యని రామచంద్రుడు చెప్పుటవలన మానుజాదు శ్రద్ధతోడ వేదాంతశ్రవణము నుజేసి సాధనచతుష్టయసంపత్తిగలవారై, జగత్తుమిధ్య బ్రహ్మమే సత్యమని, దృఢముగ దెలిసికొని, సద్గురూపదేశమును బొంది రజస్తమోగుణాత్మక బహిర్ముఖ లక్ష్యమునువదలి మనస్సును వశింపజేసి సత్వగుణాత్మకమైన అంతర్ముఖలక్ష్యమునందు బ్రహ్మానందసుఖమును బొందవలయునని తాత్పర్యము. అట్టివారు శ్రీశంకర భగవత్పాదాచార్యులవారు జెప్పినట్లు,

"శ్లో॥ గభీరే, కాసారే, విశతివిజనే, ఘోరవిపినే, విశాలే, శైలేచ, భ్రమతి, కుసుమార్థం, జడమతిః, సమర్పైకం, చేతస్సరసిజం, ముమానాథ భవతే సుఖేనావస్థాతుం జనయిహా, నజానాతికి మహో."

సులభమార్గమునెఱుఁగని అజ్ఞానులవలె భగవదార్చన పుష్పములకొఱకు పర్వతాంతర, కాననాంతర, తటాకాంతరములకుబోయి శ్రమపడునట్లుగాక నిర్మలమయిన తమహృదయకమలములను పుష్పములనర్పించి అతి సులభముగ భగవదానుగ్రహమును బడయుటకు పాత్రులగుదురని తాత్పర్యము.